# తెలుఁగు రచన
## తప్పుల దిద్దుబాటు
## వ్యాసరచనకు సూచనలు 1

1. ఏశీర్షిక (Title of the subject) ను బట్టియైన రచన వ్రాయుటకు ముందా శీర్షికయర్థమును విషయ వ్యాప్తిని (Scope of the subject matter) బూర్తిగ యోచింపకయే మనస్సునకు ముందుగాఁ దోఁచిన యంశము లను వ్రాసివేయుట విద్యార్థుల యందొక ముఖ్యదోషము. మద్యపాన నిషేధమును గుఱించి వ్రాయుమన్నప్పుడు మద్య పానమువలని కీడులను మాత్రము వ్రాయుట, వయోజన విద్యనుగుఱించి వ్రాయుమన్నపుడు విద్యవలని లాభములను మాత్రము విపులముగా వ్రాసి, ఉన్నతపాఠశాలా విద్యను గుఱించి వ్రాయుటయు నిట్టి దోషమున కుదాహరణములు.

2. రచనాశీర్షికను బూర్తిగ నర్థముచేసికొన్న పిమ్మట విషయ విభాగము చేసికొని (a) ప్రవేశకము (Introduction) క్రింద నొకటి రెండు ముఖ్యాంశములను (b) విషయ వస్తువు (Matter or body of the composition) నాలుగైదు వేఱు వేఱు అంశములను, (c) ఉపసంహారము (Conclusion) క్రింద నొకటి రెండంశములను గుర్తించి కొని, స్థూలాంశములను గుప్తముగ వ్రాసిపెట్టుకొనుట మేలు.

3. అఱువది, డెబ్బది పంక్తులలో ముగింపవలసిన వ్యాసమునకుఁ బది పంక్తులకు మించని ప్రవేశకమును వ్రాయఁ దలఁచుకొన్న విషయమును బరిచయము గావింపుచు వ్రాయవలెను. పిమ్మటఁ బ్రధానవిషయవస్తువును గుఱించి నాలు గైదు పరిచ్ఛేదములలో (Paragraphs) నాలుగైదుభిన్నాంశములను గుఱించి విపులీకరించి విషయపుష్టిని గలిగింపవలెను. ఏదో యొక యంశమును మాత్రము వివరించుట విద్యార్థులలోఁ గానవగు దోషము. భాషలో నెగుడుదిగుడు లుండరాదు. కొందఱు దమకుఁబూర్తిగ వశములోలేని గాంభీర్య శైలితో నారంభించి కొన్నితావుల మిక్కిలి పేలవముగ వ్రాయుదురు. సూటియైన భావములను ధారాళమై సరళమై దమకుఁ బరిచితమైనశైలిలోఁ దమ తరగతికిఁ దగిన స్థాయిలో వ్రాయవలెను. ఆడంబరముతోఁగూడి యసహజమైన శైలిలో వ్రాయుదోషము పెక్కండ్రలోఁ గానవగును. ముందు వ్రాయవలసిన యంశములను వెనుకను, వెనుకటివానిని ముందును నల్లరిబిల్లరిగా వ్రాసివేయక క్రమమునుబట్టి యంశములను వృద్ధిపొందింపవలెను. భాషా సంప్రదాయమునుబట్టి జాతీయములను (idioms) సామెతలను (proverbs) నడుమ నడుమఁ బొందుపఱిచినచో రచనకు నందమును మాధుర్యమును చేకూఱును. వ్రాసినమాటనే పెక్కుమార్లు వ్రాయుట (Repetition) యొక దోషము - వైవిధ్య ముండవలెను (Variety). విషయదారిద్ర్య మెట్టి దోషమో భాషాదారి

ద్రవ్యము గూడ నట్టిదియే. కాన శబ్దదోషములును, వర్ణక్రమ దోషములును, సంధిసమాసదోషములును, వాక్యాన్వయ దోషములును (Mistakes in sequence of subject, predicate etc.) లేకుండ చూచుకొనవలెను. పరీక్షాధికారి మనస్సునకు దురభిప్రాయమును (bad impression) కలిగించెడి రచనాఫలితములను విద్యార్థులు గుర్తించుకొనవలెను. స్పష్టమైన వ్రాత యావశ్యకతను గుఱించి (Clear hand writing) వేఱుగ వ్రాయనక్కఱలేదు. ప్రధానవస్తువును గుఱించిముగించి, యుపసంహార వాక్యములు వ్రాయకుండ విడువరాదు. చివర నొక పరిచ్ఛేదములో రచయితలు తమ యభిప్రాయములను గాని, తమ కర్తవ్యములను గాని వివరించుచుఁ గొలఁదిపంక్తులలో ముగింపు మాటలు వ్రాయవలెను.

4. పరీక్షాధికారులు విషయవస్తువు (matter) నకును, ప్రదర్శనాపద్ధతికిని (Manner) మొత్తపుటభిప్రాయము (General impression) నకును (శుభ్రత, స్పష్టత, వ్రాత) విలువకట్టుదురు గాన నీవిషయములందు విద్యార్థులు పరాకు జెందరాదు.

# సామాన్య భాషా దోషములు II

1. ఒత్తుగల యక్షరములలో, బెక్కుతప్పులు వ్రాయుచున్నారు. కాన విద్యార్థులీ క్రిందిపదములను బలుమాఱు చూచి మనస్సునకుఁ బట్టించుకొనవలెను.

| | | |
|---|---|---|
| విద్యాగంధము | పాఠము | ఉచ్చారణ |
| వ్యాఘ్రము | భ్రష్టుఁడు | విద్యుచ్ఛక్తి |
| భాగ్యము | దుఃఖము | మధ్యాహ్నము |
| భక్షించుట | నిర్బంధము | స్తంభము |
| భేదము | సంబంధించు | సంఘము (Society) |
| సమర్థుఁడు | అవలంబించు | ప్రఖ్యాతి |
| శ్రేష్ఠము | గాఢము | గృహస్థుఁడు |
| ప్రధానము | శత్రుఘ్నుఁడు | శీఘ్రము |
| ధిక్కరించు | నిశ్శబ్దముగా | బోధ |
| ఘనుఁడు | ఉచ్ఛ్వాసము | ఫలము |

2. థ, ధ లలో నొకదాని కొకటి వ్రాయుట తప్పు

"థ" గలపదములు :— కథ, ప్రథమము, చతుర్థము, తిథి, పథము, స్థానము, స్థిరము, తథ్యము, స్థూలము, శపథము, మథించు, అతిథి, దేశస్థులు, గ్రంథము, యథార్థము, విద్యార్థి, అర్థము (=కొఱకు, ధనము) అవస్థ. ధ గల పదములు :- అంధుఁడు, బధిరుఁడు, బుధుఁడు, బాధ, అర్ధము (=సగము, ముక్క) ధనము, ధాన్యము, ధార, బద్ధము, సన్నద్ధము.

3. శ, ష, స, వర్ణములలో తప్పులు వచ్చుచున్నవి. ఈ క్రిందిపదములు పరిచయము గావించుకొనుఁడు.

| | | |
|---|---|---|
| ఆస్వాదించుట | శాశ్వతము | ఉష్ణము |
| సెలవు | శ్రుతి | శాసనము |
| పరశురాముఁడు | శిశువు | స్మృతి |
| శూద్రుఁడు | నిశ్చయించు | రశ్మి |
| సులభము | ఆలస్యము | శునకము |
| శృంగారము | సంశయము | ఆసక్తి |
| రహస్యము | శిరస్సు | విషయము |
| శబ్దము | ఆకాశము | అస్వస్థత |
| శుశ్రూష | శీతలము | ప్రస్తుతము |
| శిష్యుఁడు | సీత | ఆవేశము |
| శ్మశానము | ప్రకాశించు | శ్వాసకోశము |

అభ్యసించు, నివసించు, ప్రవేశించు మొదలగు క్రియాపదములలో సందేహము కలిగినచో, నాపదముల నామవాచక రూపములగు అభ్యాసము, నివాసము, ప్రవేశములను దలఁచుకొని యాపదములలో నే యక్షరమున్న దానినే క్రియారూపమున వాడవలెను. ప్రశంస = ప్రశంసించు; విశ్వాసము = విశ్వసించు; ఉద్దేశము = ఉద్దేశించు;

4. ట, ఠ లలో నొకదానికొకటి వ్రాయుట తప్పు. ఈ క్రింది ఒప్పులను చూడుఁడు.

కష్టము, సృష్టి, ఇష్టము, పటిమ, షష్టి (=60) దృష్టి, పాట, అష్టమి, అదృష్టము, షష్ఠి (=6) జ్యేష్ఠుఁడు, నిష్ఠురము, ప్రతిష్ఠించు.

౫. తెలుఁగు పదముల మొదట య, ఙ, ళ, వు, వూ, వొ, వో లుండవు. కొన్ని సంస్కృతపదముల మొదట తప్పుగా వు, వూలు వాడుచున్నారు.

| | | | |
|---|---|---|---|
| తప్పు | ఒప్పు | తప్పు | ఒప్పు |
| వొకటి | ఒకటి | వుద్యమించు | ఉద్యమించు |
| వద్ద | ఒద్ద | వుద్ధరించు | ఉద్ధరించు |
| వుప్పు | ఉప్పు | వుపాధ్యాయుడు | ఉపాధ్యాయుఁడు |
| వుత్తరము | ఉత్తరము | వుత్తమము | ఉత్తమము |
| వూరు | ఊరు | వూహ | ఊహ |
| యడల | ఎడల | వుత్తీర్ణులు | ఉత్తీర్ణులు |
| వుపయోగము | ఉపయోగము | వూరక | ఊరక |
| యెవఁడు | ఎవఁడు | యేనుఁగు | ఏనుఁగు |
| వప్పగించు | ఒప్పగించు | వోపిక | ఓపిక |
| వుండలేదు | ఉండలేదు | వుదయము | ఉదయము |

౬. వర్ణక్రమాదిదోషములతో నీ క్రింది పదములు వ్రాయుచున్నారు. కాన ఒప్పురూపములు గుర్తించుకొనుఁడు.

| | | |
|---|---|---|
| యజ్ఞము | గృహాము | బ్రాహ్మణుఁడు |
| జ్ఞానము | సన్యాసి | బృహాస్పతి |
| చికిత్స | తీక్ష్ణము | దార్ఢ్యము |
| పతివ్రత | దారిద్ర్యము | తల్లిదండ్రులు |
| మౌనము | ప్రాతఃకాలము | కొంచెము |
| ఆశ్చర్యము | బ్రహ్మదేవుఁడు | అవసరము |
| సహాస్రబాహుఁడు | కృత్యము | యథేచ్ఛముగా |
| ఆజ్ఞ | అర్జునుఁడు | సమృద్ధి |

| | | |
|---|---|---|
| విద్యుచ్ఛక్తి | తృప్తి | చంచలస్థితి |
| శరచ్చంద్రిక | వెండ్రిక | భగవచ్చింత |
| కూ్రరుఁడు | స్తుతించు | శుభ్రత |
| వర్ణము | ప్రతిజ్ఞ | తత్క్షణము(వెంటనే) |
| మాహాత్మ్యము | విఘ్నము | నిగూఢము |

7. "ృ" వర్ణము ఉకారముతోడి హల్లు మీాదచేర్చ రాదు. కృష్ణుడు తుృప్తి - ఇట్లు వ్రాయరాదు.

ఐగుర్తు (ై) తావత్తు (ై) లను తారుమారు చేయ రాదు. కొమార్తె, నేస్తము, సైగ, పైకము, అట్లైన, ఎత్తైన.

ఒత్తుగల బకారమునకే తలకట్టుండును. కాన భ్రహ్మభంధువులు, భలము, అని వ్రాయరాదు. బక్షించు, బద్రము, అబ్యసించు అని వ్రాయరాదు. భక్షించు, భద్రము, అభ్యసించు, అనుటసరి.

సున్న (బిందువు) పూర్వాక్షరముతోనే యుండును. కాన "కుంభములో"కు పైపంక్తిలోవ్రాసి రెండవపంక్తి మొదట "ంభ"ము అని వ్రాయరాదు.

కొందఱు ఘ, షు లకును ఋ, ౠలకును భేదమెఱుఁగకున్నారు. మేఘము, జిగీషువు, ఋతువు, ఋణము. వ, మ, య లలో తలకట్టు తప్పుగా నిడుచున్నారు. వ, మ లలో తలకట్టు సరిగా బిందువుతలమీాఁదికి వచ్చును.

తెలుఁగు పదములచివర బిందువుండదుగాన వనం, బలం, ఆరోగ్యం—ఇట్లు వ్రాయరాదు.

వాక్యారంభమున గడచిన, గనుక, గావున, గాని అని వ్రాయరాదు. కడచిన, కనుక, కావున, కాని అనియే వ్రాయవలెను. సంధి స్థలములలో "క" "గ" గా మాఱును.

శకటరేఫము తెలుఁగు పదములలో మాత్రమే యుండును. కాన ఇతరపదములను దెలియక శకటరేఫముతో వ్రాయరాదు. తెలుఁగు పదములలో ద్విత్వరేఫమును శకటరేఫముగానే వ్రాయవలెను. గొఱ్ఱె, అఱ్ఱు,

రోడ్డు, అసలు, ఖర్చు, ద్వారా, రోజా, ప్లైము మొదలగు నన్య భాషాపదములు వ్రాయరాదు.

---

# సంధి III

1. తెలుఁగులో రెండచ్చులొకదానికొకటి చేరినపుడు మొదటిది లోపించి రెండవ యచ్చుస్థానమున నిలుచుట సంధి యగును.

వచ్చెను (న్ + ఉ) + అతఁడు = వచ్చెన్ + అతఁడు = వచ్చెనతఁడు. అకారము మీఁద పెక్కుమార్లును. ఇకారము మీఁద సాధారణముగాను సంధియుండదు. దీర్ఘాచ్చుల మీఁద సంధియుండదు.

ఆ, ఈ, ఊ, ఏ, ఐ, ఓ, ఔలు దీర్ఘాచ్చులు. ఎ, ఒ, లు గూడ దీర్ఘాచ్చులతో సమానములు. కాన వీనిమీఁద అచ్చువచ్చిచేరినపుడు 'య' ఆగమముగా వచ్చును. (= ఆగమ మనగా మిత్రుఁడువచ్చి ప్రక్కను కూర్చున్నట్లు దాని ప్రక్కనున్న అచ్చుతోఁ గలిసిపోవుట)

నీవా+ఇట్లంటివి = నీవా + య్ + ఇట్లంటివి=నీవా యిట్లంటివి.

మీా + ఊరు = మీాయూరు

ఎటులో + ఎఱుఁగను = ఎటులోయెఱుఁగను

ఏ + ఏదేశము=ఏయేదేశము

వానికై +ఇంత = వానికైయింత.

2. అకారసంధి :-

ఆకు, అయ్య, అన్న, అప్ప, అమ్మ, ఎడు, అంత, ఏసి, మొదలగునవి చేరినపుడు తప్పకసంధియగును. చింత + ఆకు చింతాకు, రామ+అయ్య=రామయ్య, మూర+ఎడు= మూరెడు.

మొదటిపదము స్త్రీని దెలుపునదైనను, తత్సమ పద మైనను, సంబోధనమును దెల్పునదైనను, నిశ్చయమును దెల్పునదైనను సంధిలేదు.

అమ్మ+ఎక్కడ=అమ్మయెక్కడ

హంస+ఏది=హంసయేది

మిత్రమ+ఇటురమ్ము=మిత్రమయిటురమ్ము

నీవ (=నీవే)+అంటివి=నీవయంటివి

అకారముపై సంధికాని తావులే చాలహెచ్చు:

వ్యతిరేకక్త్వార్థకముల మీాఁదను (చేయక, వ్రాయక మొ॥) మేన, పుట్టిన మొ॥ వానిమీాఁదను, సంధివైకల్పికము (ఒకమాఱువచ్చును. ఒకమాఱురాదు)

చూడక+ఉండెను=చూడకుండెను, చూడకయుండెను.

పుట్టిన+ఇల్లు= పుట్టినిల్లు, పుట్టినయిల్లు.

3. ఇకారసంధి :

మధ్యమపురుష ఇకారముమీఁద సంధితప్పదు :

వచ్చితివి + అని = వచ్చితివని

ఇతరపురుషములమీఁది ఇకారమునకు వైకల్పికము

వచ్చితిమి + ఇపుడు = వచ్చితిమిపుడు, వచ్చితిమియిపుడు

వచ్చిరి + అపుడు = వచ్చిరపుడు, వచ్చిరియపుడు

ఏమి, మఱి, అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి, షష్ఠీవిభక్తి "కిన్" (ఆనతి, చేయని, ఒకటి, ఎనిమిది, తొమ్మిది, పది) మీఁది ఇకారమునకు సంధి వైకల్పికము

ఏమి + అంటివి = ఏమంటివి, ఏమియంటివి

అది + ఏమి = అదేమి, అదియేమి

వానికిన్ + ఒక = వానికొక (సంధియైనది) వానికినొక (సంధి లేదు) క్త్వార్థకఇకారమునకును, సాధారణముగా ఇతర ఇకారమునకును సంధిజరుగదు.

వచ్చి + ఇచ్చెను = వచ్చియిచ్చెను.

భూమి + అంతయు = భూమియంతయు.

లక్ష్మి + అమ్మ = లక్ష్మమ్మ, మామిడి + ఆకు = మామిడాకు మొదలగుచోటులందు సంధి తప్పదు.

4 ఉకారసంధి :

ఉకారముమీఁద సంధి తప్పకజరుగును. ఇట్టిచోటుల యడాగము కొంత మాత్రమును జేయరాదు.

అతఁడు + అనెను = అతఁడనెను.

విభక్తి ప్రత్యయములలో నున్, కొఱకున్, కున్, అందున్ అనువాని మీఁదను, క్రియకు చున్ చేరగా నేర్పడిన

శతౄర్థకము మీఁదను (చూచుచున్) సంధి వైకల్పికము (=సంధి యైన రూప మొకటి, కాని దొకటి)

నన్నున్+అడిగెన్=నన్నడిగెన్, నన్ను నడిగెన్

నాకొఱకున్+ఇచ్చె=నాకొఱకిచ్చె, నాకొఱకునిచ్చె

నాకున్+ఏది=నాకేది, నాకునేది

ఇంటియందున్+ఉన్న=ఇంటియందున్న, ఇంటియందునున్న,

చూచుచున్ + ఏగెన్ = చూచుచేగెన్, చూచుచునేగెన్.

రామున్+అడిగెన్, రామడిగెన్ కాదు. ననున్+అడిగెన్, ననడిగెన్, కాదు)

5. విభక్తిప్రత్యయములు నామవాచకములమీఁదను సర్వనామములమీఁదను జేర్పఁబడును. ఈ ప్రత్యయములు తత్సమ పుంలింగ పదములపై వాని ద్వితీయావిభక్తిరూపము మీఁదను (రామునిᐩతో, కృష్ణునిᐩకొఱకు) తెలుఁగు పదములపై వాని ప్రథమావిభక్తి రూపముమీఁదను జేరును (గుఱ్ఱము+తో)

ఇల్లు, ఊరు, చేయి, మొదలగు పదములపై విభక్తి ప్రత్యయములు చేరినపుడా ప్రత్యయములకు ముందు ఇ. టి, తి, వర్ణములు కొన్ని మార్పులతోఁ జేరును. ఈయక్షరములకు ఉపవిభక్తులని పేరు. ఈయుపవిభక్తులను జేర్చుకొనుపదములు ఔపవిభక్తికములు.

ఔపవిభక్తిక పదములను సామాన్య విభక్తులతో వ్రాయరాదు.

ఈక్రింది రూపములు సరియైనవని తెలిసికొనుఁడు.

ఊరు + న + ని = ఊరిని    కాలు + ఇ + ని = కాలిని

గోరు + టి + ని = గోటిని    నోరు + ఇ + ని = నోరిని, నోటిని

త్రాడు + టి + ని = త్రాటిని    ఏఱు + టి + ని = ఏటిని

అన్ని + టి + ని = అన్నిటిని    ఎనిమిది + టి + ని = ఎనిమిదిటిని

అన్నింటిని    ఎనిమిదింటిని

కన్ను + ంటి + ని = కంటిని    మిన్ను + ంటి + ని = మింటిని

అఱ్ఱు + తి + ని = అఱితిని    గోయి + తి + ని = గోతిని

6. సంస్కృత నామవాచకములమీఁద త్వ, వత్, మత్, మొదలైన ప్రత్యయములును, తెలుఁగు నామవాచకములమీఁదను, విశేషణములమీఁదను, తనము, ఱికము, ఇమి, ఉక, కాఁడు, కత్తె, ఈఁడు, అరి, ఎడు, మొదలగు ప్రత్యయములును చేరుటచే తద్ధితము లేర్పడును. తెలుఁగు పదముల మీఁద సంస్కృత ప్రత్యయములు చేర్చిగాని, తాఱుమాఱుగా గాని వాడరాదు. అల్పతనము, మేలుతరము ఇట్టివి తప్పులు.

ప్ర, పర, అప, అవ, నిర్ మొ॥ ఉపసర్గలను సంస్కృత పదములకు ముందుమాత్రమే చేర్పవలెను. ఉదా: ప్రతిదినము అపఖ్యాతి, పరమప్రీతి, నిర్దయ. మొ॥

| నామవాచకము (సంస్కృతపదములు) | తద్ధితము |
|---|---|
| సాధు | సాధుత్వము |
| ధీర | ధీరత్వము |
| రాజ్ఞీ | రాజ్ఞీత్వము |
| చక్రవర్తి | చక్రవర్తిత్వము |

| | |
|---|---|
| ధన | ధనవంతుఁడు |
| బుద్ధి | బుద్ధిమంతుఁడు |

తెలుఁగుపదములు

| | |
|---|---|
| గొప్ప | గొప్పతనము |
| బీద | బీదతనము |
| వేడి | వేడిమి |
| నడవడి | నడవడిక |
| వేఁట | వేఁటకాఁడు |
| కల్లరి | కల్లరీడు |
| జూదము | జూదరి |
| కుంచము | కుంచెడు |

7. తెలుఁగు పదములలో కళలను ద్రుతప్రకృతికము లను నెఱుఁగక చాలతప్పులు వ్రాయుచున్నారు. కొన్నిపద ములచివర సహజముగా, ను, ని అక్షరములుండును. ఆయక్షర ములు తీసివేసినచో నా పదముల కర్థముండదు. పేను, మీను, చేను, బోను మొ॥

ఇట్టివిగాక విభక్తి సంబంధముగా, న్, ను, ని, చేరు పదములు ద్రుతప్రకృతికములనఁబడును. న్, ను, ని, ప్రత్యయ ములు ద్రుతములనఁబడును. ఇవి యవసరమున్న నుండి లేనిచో దొలఁగిపోయినను శబ్దముచెడదు. ఉదా:-హరిని - హరి, గుఱ్ఱ మును - గుఱ్ఱము. ద్రుతము చివరలేని పదములు కళలు. కళలకు సంధియగుచో నగును. లేనిచో యడాగమమగునుకాని కళమీఁద అచ్చుచేరినపుడు నకారము చేర్చరాదు. లేక + ఏ= లేకయే-(లేకనేఅనరాదు) ఈక్రిందివి కళలు: విభక్తిప్రత్య

యములలో, డు, ము, వు, లు, కూర్చి, కై, పట్టి, యొక్క, సంబోధనములును, క్రియలలో చేసిరి, చేసితిమి, మొదలగు ప్రథమ ఉత్తమపురుషముల బహువచనములును, చేసితివి, చేసితిరి మొదలైన మధ్యమ పురుషైక వచన బహువచనములును.

అవ్యయములలో, తిని, చేసి మొదలైన క్త్వార్థకములును, చేయక వ్రాయక మొ॥ వ్యతిరేకక్త్వార్థకములును, ఈక్రిందిపదములును కళలు, అన్ని, కొన్ని, ఇన్ని, పలు, పెక్కు, నీ, నా, మన, ఇందఱు, అందఱు, కొందఱు, పెక్కుఱు పలువురు, అది, అవి, మొ॥ ఏమి, తాము, తమరు, మేము, మెత్తని, తెల్లని, నల్లని, సన్న, చిన్న, ఇంచుక, కొంచెము, బళి, అయ్యో, అకట, అప్పుడు, మొ॥ అటు, మొ॥ ఏల, ఊరక, మిన్నక, ఒండె, మఱి, ఒకో, కాని, కాఁబట్టి, లేక, వేగ, మిక్కిలి.

వాఁడు + ఏగెను = వాఁడేగెను.

నీకై + ఇంతశ్రమ = నీకైయింతశ్రమ

లేక + ఉండెను = లేకయుండెను

మిక్కిలి + అన్యాయము = మిక్కిలియన్యాయము.

8. ఈ క్రిందివి దృత ప్రకృతికములు :

విభక్తి ప్రత్యయములలో నిన్, నున్, లన్, చేతన్, చేన్, తోడన్, తోన్, కొఱకున్, వలనన్, కంటెన్, కిన్, కున్, లోన్, లోపలన్, అందున్, ("అందు" కళయని పూర్వకవి ప్రయోగములున్నవి) నన్.

అవ్యయములలో చున్, అన్, డున్, ఇనన్, అంత ములు (చూచుచున్, చేయన్, చేయుడున్, చేసినన్)

క్రియలలో ఉత్తమపురుషైక వచనములును, చేయుదున్, చేసెదను, భూతతద్ధర్మార్థకములలో ప్రథమపురుషైక వచనములును చేసెన్, చేయున్.

ఎడున్, తన్ అంతమందుఁగల ఆశీరర్థకములును, కలిగెడున్, కావుతన్, నేను, తాను, ఎంతయున్, కూడన్, మాఱ్కన్, పోలెన్, వలెన్, కానన్, కావునన్, కాబోలున్ గ్రక్కునన్, క్రమ్మరన్, మరలన్, కనుకన్, దనుకన్, దాకన్, మఱియున్, పిమ్మటన్, పిదపన్, తరువాతన్, మీఁదన్, వెండియున్, అంతటన్, కడున్, ఇఁకన్, ఎందేన్, ఎట్టకేన్, ఎట్టకేనిన్, ఎట్టకేలకున్, మిగులన్, వెంటన్, వెంబడిన్, చాలన్, అటన్, ఎడలన్, కాన్, కన్ (బాగుగాన్, అందముగన్) రాన్, అటులన్, మొ॥ ఉన్, నున్, (సముచ్చయములు, సీతయున్, రాముడునున్) ఐనన్, పైన్, పైకిన్, తిరుగన్, తప్పన్, అయ్యేన్.

ద్రుతముమీఁద అచ్చు చేరినచో సంధికాదు. నకార పొల్లుమీఁద వెనుకవచ్చిన అచ్చు నిలుచును.

ఉ: మీఁదన్ + ఏమాయె = మీఁదనేమాయె.

మీఁదేమాయె. అని సంధిచేయరాదు.

ఇఁకన్, ఎట్టకేలకున్ అనువానిలో మాత్రము సంధి వైకల్పికముగా జరిగి ఇఁకేమి, ఇఁకనేమి వంటిరూపములగును, ద్రుతముమీఁద క, చ, ట, త, ప, లు చేరినచో నవి గ, జ, డ, ద, బ, లుగా మాఱును. క్రొత్తగా నేర్పడిన గ, జ, డ,

ద, బ, లకు ముందున్న ద్రుతము అరసున్నగనో నిండుసున్నగనో మారును.

కావునన్ + కరుణతో = కావునఁగరుణతో, కావునం గరుణతో. ద్రుతముమీఁద క, చ, ట, త, ప లుగాక ఇతర వర్ణములు చేరినపుడు ద్రుతములోపించుట కలదు.

కావునన్ + జగడము = కావునజగడము

పిమ్మటన్ + మరచితిని = పిమ్మట మరచితిని

సూచన : ద్రుతముమీఁద నచ్చు చేరినపుడు యడాగమము చేయుట విద్యార్థులు తరచుఁ గావించు పెద్దతప్పు (కనుకయిట్లు, తప్పు)

9. ఉకారాంతపదముమీఁద "కు" ప్రత్యయము చేరుచో దానికిముందు న కారముచేరవలెను.

రాజు + కు = రాజు + న + కు = రాజునకు

షష్ఠీ తత్పురుషసమాసములో ఉకార, ఋకారములకు అచ్చు వచ్చి చేరుచో ముందు ను గాగమమగును.

రాజు + ఆనతి = రాజు + ను + ఆనతి = రాజునానతి.

కర్మధారయసమాసమున, ము వర్ణమునకు పు, ంపు లు వచ్చుట ఉకారముమీఁది అచ్చునకు "టు" వచ్చుట జ్ఞాపక ముంచుకొనవలెను.

ఉ: మదపుటేనుగు - ఇచ్చకపుమాట.

10. రెండుగాని యంతకంటె నెక్కువగాని పదముల నేకపదముగాఁ గూర్చి సమాసములు చేయుటలో విద్యార్థులు పెక్కుతప్పులు చేయుచున్నారు.

సంస్కృతపదములను తెలుఁగుపదములతో సమసింప రాదు. కేవల సంస్కృతపదములకు సంస్కృతసంధిసూత్రము లవలన సమాసములు చేయవచ్చును. అట్టివి, సిద్ధసమాసములు. రాజ+అజ్ఞ=రాజాజ్ఞ. తత్సమపదములకు తత్సమ పదములతోను తెలుఁగుపదములతోను సమాసముచేయ వచ్చును. వీనిలో తెలుఁగుసంధిసూత్రములే వాడనగును. రెండును తత్సమపదములే యైనచో నది సాధ్యసమాసము. ఉ: రాజునాజ్ఞ.

తత్సమములకును తెలుఁగులకును సమాసము మిశ్రమము. ఉ: రాజునానతి. రెండును తెలుఁగుపదములైనచో ఆచ్ఛికసమాసము. జేనియాన. కేవల సంస్కృతపదములతో తెలుఁగుపదములను గూర్చి సమసింపరాదు గాన, సంస్కృత పదములను దెలిసికొనుటెట్లు, వానిని దత్సమములుగా మార్చుకొనుటెట్లు అను విషయ మెఱుంగవలెను.

తెలుఁగు పదములకుఁ జివర విసర్గముగాని, హల్లుగాని యుండదు. మనః, జ్ఞానమ్, వాక్ మొదలగునవి సంస్కృత పదములే. ఎ, ఒ, చ, జ, ఱ ఁ:— ఈ యాఱును సంస్కృతమునలేవు. కాన నీ వర్ణములు గల పదములు తెలుఁగు పదములు

ఉదా. ఎవఁడు, ఒకటి, చాప, జాతర, ఏఱు, మీఁద.

తెలుఁగునకు వర్ణములు ముప్పదియాఱే. శకటరేఫముతోఁగూడి ముప్పదియేడు. సంస్కృతమునుండి, ఋ, ౠ, ఌ, ౡ, ః, ఖ, ఘ, ఙ, ఛ, ఝ, ఞ, ఠ, ఢ, థ, ధ, ఫ, భ,

శ, ష అను నీ పందొమ్మిది అక్షరములును తెలుఁగులోనికి గ్రహింపఁబడినవి. కాన ఈవర్ణములుగల పదములు సంస్కృత పదములే. (వీనిలో ఋ్రూ, ఌ, ౡ, లు వాడుకలో లేవు.)

రథః కృష్ణః, ఋణమ్.

సవర్ణదీర్ఘసంధి, గుణసంధి, వృద్ధిసంధి, యణాదేశసంధి, మొదలైన సంస్కృత సంధిసూత్రములచే నేర్పడిన సమాస ములలోని పదములన్నియు సంస్కృతపదములే. విద్యా + అర్థి = విద్యార్థి, అస్మత్ + గురుః = అస్మద్గురుః, గంగా + ఉదకమ్ + గంగోదకమ్.

ప్ర, పర, అప, అవ, అను, సమ్, నిర్, దుర్, వి, అధి, సు, ఉత్, పరి, ప్రతి, అభి, అపి, ఉప, ఆఙ్, అతి మొదలగు ఉపసర్గలు చేరెడుపదములు సంస్కృతపదములే.

ప్రత్యుత్తరమ్, అనుసరణమ్, అధిగమః, పరిభ్రమణ మొ॥. సాధారణముగా రేఫముకంటె నితరమైన హల్లుతో సంయుక్తమైన వర్ణమాదియందుఁగల శబ్దములు సంస్కృత ములోనుండి తత్సమములుగా నేర్పడినవే.

స్యందనము, జ్వరము మొ॥

తెలుఁగులో అక్క, అన్న మొదలగు ద్విత్వ వర్ణ పదములును, త్రాడు, తండ్రి మొదలైన రేఫతోగూడిన సంయుక్తాక్షరపదములును మాత్రిముండును. క్లిష్టమైన సం యుక్తాక్షరపదములుగలవి సాధారణముగ సంస్కృతమునుండి పుట్టినవే.

ఉదా:—కష్ట(ము) ఆర్ద్ర(ము) తీక్ష్ణ(ము)

తెలుఁగున పరుష, సరళములకు ముందు మాత్రమే బిందువుండుట సామాన్యము. ఉదా: దొంగ, చెంబు, కొండ. స్థిరాక్షరములకు ముందు పూర్ణబిందువుగలపదములు సంస్కృతపదములే. పింఛ(ము) శంఖ(ము).

తత్సమము లేర్పడుట :

సంస్కృతపదముల చివరనుండు విసర్గమును దీసివేసి కొలఁది మార్పులతో డు, ము, వు, ప్రత్యయములను జేర్పవలెను. ఉదా: వృద్ధః-వృద్ధుఁడు, హరిః-హరి, గురుః-గురువు, గౌః-గోవు, వృక్షః-వృక్షము, విష్ణుః-విష్ణువు, కళత్రం-కళత్రము.

సంస్కృతములో సాధారణముగా స్త్రీలింగద్యోతక పదములు దీర్ఘాంతములుగా నుండును. ఆదీర్ఘమును హ్రస్వముగా చేయవలెను. ఉదా: విద్యా-విద్య. సీతా-సీత, రమా-రమ. హలంతపదములలో తుదిహల్లు ద్విత్వముగా మారును. ఉ: వాక్-వాక్కు, ఆపత్-ఆపత్తు (ఆపద) యశస్-యశస్సు

ఇతరసూత్రాంశములను వ్యాకరణ గ్రంథములనుబట్టి యెఱుంగునది. చాల మార్పులు పొంది తద్భవపదము లేర్పడును.

ఉదా: రథః-అరదము, శుచిః-చిచ్చు, పీఠమ్-పీట మొ॥

సంస్కృతమందలి ప్రాతిపదకములపై తెలుఁగు పదములుచేర్చి, సమాసములు చేయరాదుగాన నీక్రిందివితప్పులు.

ఆహారకొఱత, దేశతండ్రి, విషపురుగు, భార్యాబిడ్డలు. వీనిని సిద్ధ సమాసరూపమున ఆహారలోపము, దేశపిత, విషకీటకము, భార్యాపుత్త్రులు, అని వ్రాయవలెను.

పుంస్త్రీ ఆగ్ని కసమాసములలో ఆహారపుకొరత, దేశపుతంత్రీం విసపుపురుషు ఆలుబిడ్డలు—అని వ్రాయవలెను. కనుక తత్సమ రూపములకు మార్చినదే సంస్కృతపదములను తెలుఁగుపదములను నేక సమాసముగఁగూర్పరాదు. సంస్కృత ప్రత్యయములను, సుపసర్గలనుగూడఁ దెలుఁగుపదములతోఁ జేర్పరాదు.

| తప్పు | ఒప్పు |
|---|---|
| అనేకమంది | అనేకులు, చాలమంది |
| అవినీతి బ్రతుకు | అవినీతి జీవితము |
| ప్రతివారు | ఎల్లవారు, ఎల్లరు, అందఱు |
| మూఢనమ్మకము | మూఢవిశ్వాసము, మూఢపునమ్మకము |
| దురలవాటు | దురభ్యాసము, చెడ్డయలవాటు |
| మేలుకరము | లాభకరము |
| చెడుద్దేశము | దురుద్దేశము, చెడుతలంపు |
| ప్రియచెల్లెలు | ప్రియసోదరి (అనుఁగుచెల్లెలు) |
| అందవికారుఁడు | సౌందర్యహీనుఁడు |
| దారిమధ్యము | మార్గమధ్యము, దారినడుమ |
| బహుమంది | చాలమంది |
| అనేకకుటీలు | చాలకుటీలు |
| పిన్నవయస్కుఁడు | పిన్నవయసువాఁడు |
| అధికపన్ను | అధికపుపన్ను, ఎక్కువపన్ను |
| శరీరబాగు | శరీరపుబాగు, శరీరక్షేమము |
| మద్యవర్తకులు | మద్యవ్యాపారులు |
| సంక్షిప్తపేరు | సంక్షిప్తనామము, క్లుప్తపుపేరు |
| నిషేధచట్టము | నిషేధశాసనము |

11.(a) క్రియాలోపములు:- మధ్యమపురుష ప్రార్థనార్థకక్రియకు "అని" చేర్చినపుడు చివరనున్న ఉకారమును అకారముగా పలుకుట వాడుకయైనది. కాని దానిని ఉకారాంతముగానే వ్రాయవలెను. వ్రాయమనెను అన్నచో, వ్రాయుము + అనెను, అని తప్పు అర్థమగును.

చేయమనికోరిరి - ఇది తప్పు- చేయుమనికోరిరి (ఒప్పు) తీనుమనెను, వంగుమనెను.

(b) యువర్ణాంత ధాతువులకు "కొను" చేర్చినపుడు "య" కు సకారముకలిగి దానిపై "ఇ" చేరును.

| ధాతువు | తప్పు | ఒప్పు |
|---|---|---|
| చేయు | చేసుక, చేసుకొను | చేసికొను |
| వ్రాయు | వ్రాసుక, వ్రాసుకొను | వ్రాసికొను |
| తీయు | తీసుక, తీసుకొను | తీసికొను |
| వేయు | వేసుక, వేసుకొను | వేసికొను |

(c) 'C' "ఇచ్చు" ధాతువుమీంది, ప్రార్థనార్థక, వ్యతిరేకార్థక రూపములు మొదలగువానిలో తప్పులు వ్రాయుచున్నారు.

| తప్పు | ఒప్పు |
|---|---|
| ఇవ్వమనికోరె | ఇమ్మనికోరె, ఇయ్యుమనికోరె |
| ఇవ్వఁబోయెను | ఈఁబోయెను, ఇయ్యఁబోయెను |
| ఇవ్వకున్నాఁడు | ఈకున్నాఁడు, ఇయ్యకున్నాఁడు |

(d) కూరుచు + ఉండు మొ॥ శబ్దపల్లవములు తప్పుగా వ్రాయుచున్నారు.

| తప్పు | ఒప్పు |
|---|---|
| కూర్చుని, కూర్చొని | కూరుచుండి, కూర్చుండి |

12. భజ్, త్యజ్, పూజ్, భక్ష్, మొదలగు సంస్కృత ధాతువులను తెలుఁగులో వాడుచో వానిచివర ఇంచు ప్రత్యయము చేర్చవలెను. భజించు, త్యజించు, పూజించు, భక్షించు. ఈ ఇంచు, వలన ధాతువునకు ప్రేరణార్థము కలుగదు. ఈ ధాతువులకు ప్రేరణార్థము కలుగుటకు వేఱొక 'ఇంచు' చేర్చవలెను. ప్రేరణమున 'చ' కారమునకు 'ప' కారము వచ్చును కావున పచ్ (వండు) పచించు (పచించించు) 'పచింపించు' అగును. తెలుఁగున ధాతువునకు 'ఇంచు' చేర్చినచో ప్రేరణార్థము కలుగును. తిను – తినిపించు, వచ్చు – రావించు తెలుఁగులో ప్రేరణ 'ఇంచు' మీఁద ఇంకొక 'ఇంచు' చేర్చరాదు. చదివింపించు అనరాదు. చదివింపఁజేయు - అనవచ్చును.

'చ' కారము 'ప' కారముగా మాఱునట్టి తావు లెఱిఁగి వ్రాయవలెను. ఈక్రిందివి గుర్తుంచుకొనుఁడు.

| | |
|---|---|
| వ్యతిరేకార్థకము | రక్షింపక |
| తుమున్నాద్యర్థకము | రక్షింపన్ |
| భవిష్యదర్థకము | రక్షింపఁగలను |
| కర్మణ్యర్థకము | రక్షింపఁబడు |
| ప్రార్థనార్థకము | రక్షింపుము |
| ప్రేరణము | రక్షింపించెను |

13. యు, ను, సముచ్చయములు తెలిసివాడవలెను. నామవాచకములను దత్తుల్యమైన వానితోఁ జేర్చునపుడు

అకారాంత, ఇకారాంత పదములకు "యు" చేర్చవలెను. ఉకారాంత పదములకు "ను" చేర్చవలెను.

ఉదా:- కష్టమును, సుఖమును; దేవియు, దేవరయు; హరియు రాముఁడును; చెప్పుటయు, చేయుటయు; వచ్చియు, రాకయు.

14. కర్తకును క్రియకును లింగవచనవిభక్తులలో నన్వయము కుదిరియుండవలెను. కర్తలేని వాక్యము లుండరాదు. ఒకవాక్యములోఁ గర్తకనఁబడకున్నను దానిముందు వాక్యములోని కర్త యావాక్యమునకును నొక్కొక్కప్పుడు సరిపోవును. సర్వనామము తనముందు వాక్యములోని ప్రధాన నామవాచకముతో సంబంధించి యుండును. "తాను, తన" ఇట్టి ఆత్మార్థక సర్వనామములు తెలిసి వాడవలెను. తాను వచ్చె అని ప్రారంభింపరాదు. అతఁడు వచ్చె అనవచ్చును.

15. సంస్కృతసంధులు కొన్నియైనను తెలియవలెను.

(a) రెండు సంస్కృతపదము లొకదానికొకటి చేరినపుడు సంస్కృతసంధిసూత్రములనే వాడవలెను.

మొదటిపదము చివరనున్న హ్రస్వదీర్ఘములగు అ, ఇ, ఉ, ఋ లకు అవే వర్ణములు క్రమముగాచేరినచో వానికి దీర్ఘము లగును. ఇది సవర్ణదీర్ఘసంధి.

విద్యా + అభ్యాసము = విద్యాభ్యాసము.

రాక్షస + అరి = రాక్షసారి

గిరి + ఇంద్రుఁడు = గిరీంద్రుఁడు

గురు + ఉపదేశము = గురూపదేశము

(b) అ, ఆ, లకు ఇ, ఈ, వర్ణములు చేరి ఏ కారమగుటయు. ఉ, ఊ వర్ణములు చేరి ఓ కారమగుటయు, ఋ కారము చేరి "అర్" అగుటయు గుణసంధి.

గంగా + ఉదకము = గంగోదకము

ఉప + ఇంద్రుడు = ఉపేంద్రుడు

దేవ + ఋషి = దేవర్షి (దేవఋషి కూడనగును.)

(c) అ, ఆ వర్ణములకు ఏ, ఐ, లు చేరి ఐ అగుట, ఓ, ఔ లు చేరి 'ఔ' అగుటయు, ఋ చేరి ఆర్ అగుట వృద్ధిసంధి.

జ్ఞాన + ఏకప్రదము = జ్ఞానైకప్రదము

దివ + ఓకసులు = దివౌకసులు

(d) ఇ, ఉ, ఋ లకు వానికి భిన్నమగు అచ్చు చేరి వరుసగా య, వ, ర, లగుట. ఇది యణాదేశసంధి.

ప్రతి + అక్షము = ప్రత్యక్షము

గురు + ఆజ్ఞ = గుర్వాజ్ఞ

పితృ + ఆజ్ఞ = పిత్రాజ్ఞ

శబ్దదోషములు :— ఈక్రిందివానిలో తప్పులు సరిచేయుడు.

1. తల్లి దండ్రులు
2. కంఠస్తము
3. రాజ్యాంగ విదానము
4. ప్రబుత్వము
5. దేశంలో
6. భందువులు
7. కోంచము
8. భోదించెను
9. నివశించు
10. నిశబ్దము
11. పాటశాల
12. ప్రక్యాతి
13. అవుసరము
14. కూపస్త మండూకము
15. అవలంభించె
16. ధృడముగా

17. శతాబ్ధము
18. అశ్వస్తత
19. అద్రుష్టం
20. శంశారావము
21. దురవస్త
22. దుస్తితి
23. కష్ఠములు
24. రామక్రిష్ణ
25. చెంచెలస్తితి
26. సమస్థజనులు
27. అవస్తపడు
28. భగవశ్చింత
29. తినుభండారము
30. సృంఖలములు
31. స్వాతంత్రయము
32. వకఛత్రాధిపత్యము
33. ఉల్లంగించి
34. ఉదహారణము
35. పాచ్చాత్య
36. శ్రేయస్సుకరము
37. ప్రవేసించి
38. విశయము
39. రాణిత్వము
40. వప్పుకొని
41. పరిశర్య
42. శిశ్యులు
43. సమ్రుద్ధి
44. సుబ్రత
45. ఘూడము
46. క్రమీణ
47. ఒల్లు (=శరీరము)
48. వ్రస్థుతము
49. పశ్చాత్తాపుఁడు
50. దృష్టాంతరము
51. మహాత్యము
52. అతను
53. పుస్తకము
54. అయిష్టము
55. దగ్గిర
56. పూర్వీకులు
57. సాంజ్ఞ
58. పాటకుఁడు
59. ఇవ్వవలెను
60. బాగా
61. రాయభారము
62. అగుపడు
63. సాయంత్రము
64. వాయిద్యములు

65. హాత్ర్రచాలనము
66. భండితులు
67. మరశ
68. రాసినాడు
69. విశ్వశించి

# దోషనిరాకరణాభ్యాసములు IV
## దీర్ఘాచ్చులపై యడాగమము

IV వ భాగములోని యంశములకు గావలసిన వ్యాకరణ విషయములు III వ భాగములో నున్నవి. సరిగా ఆయంకెలను బట్టి చూడుఁడు.

1. (a) ఈ క్రింది సంధులు చేయుఁడు-తగినమార్పులు గావింపుఁడు

1 నీవా+అడిగితివి
2 మీ+ఊహ
3 ఎట్టెట్టూ+అని
4 నీవె+ఇట్లనిన
5 ఎందే+ఇడుములు
6 వానికై+ఇంతశ్రమ
7 ఎట్టులో+ఎఱుఁగను
8 ఎవఁడో+ఒకఁడు
9 నా+ఆనతి
10 వేగమే+అరుగుము
11 శ్రీ+అనగా
12 అబ్బో+ఇదేమి
13 ఎఱిఁగియే+ఉందురు
14 వచ్చుటచేతనే+ఆతఁడు

(b) ఈక్రిందివానిలో తప్పులు సరిచేయుఁడు

1 మీవూరేది
2 ఆవుత్తరము
3 ఇతఁడేనానని యడిగె
4 ఆమెనొకయుపాయము చెప్పె
5 నీవద్దనున్న సొమ్ము
6 అతఁడో నితడో
7 ఎవరో నొకరు
8 వెంటనేనతఁడు

## 2. (a) అకారసంధి, సంధులు చేయుఁడు

1 ఖండించుట+అసంభవము
2 అందుఁగల+ఒక
3 యొక్క+ఉద్దేశము
4 మన+ఊరి
5 ఎంత+ఆవశ్యకమో
6 తిన్న+ఇల్లు
7 వెల+ఎంత
8 వాస+ఎక్కువ
9 ధర+ఎంత
10 వేళ+అయినది
11 తినక+ఇచ్చెను
12 గాడిద+అఱపు
13 కొంతె+అడిగెను
14 రాక+ఉండెను
15 వచ్చుచున్న+ఒకవ్యక్తి
16 పదవ+ఏట
17 లేక+ఊరక
18 పీట+అందు
19 పల్లెల+అభివృద్ధి
20 చెప్పక+ఉండెను
21 ఉన్న+ఊరు
22 ఎండ+ఎంత
23 పడవ+అడుగు
24 శ్రమ+ఎఱుఁగక
25 మాట+ఇచ్చి
26 వేఁట+ఎంతక్రూరము
27 అంత+ఉత్సాహము
28 అంగన+అను

## (b) ఈక్రిందివానిలో తప్పులు సవరింపుఁడు

1 నీవనిట్లన్నచో
2 అమ్మనేమనిచెప్పెను
3 ఒక నుపాయము
4 అందుగలనొక
5 బంధువులనింటికిపోయె
6 చేయలేక నూరక
7 మనమూరివాఁడా ?
8 మచ్చికనగునట్లు
9 ఎంతనావశ్యకమో
10 తెలనదరిపోవునట్లు
11 పాత్రినందు
12 పెద్దన నాత్రోవంబోయె

3. (a) ఇకారసంధి:- ఈక్రిందివానిలోఁ దప్పక సంధి యగుచోట సంధిచేసి వైకల్పికసంధి స్థలములలో రెండురూపములు వ్రాసి, సంధి కుదరనిచోట యడాగమముచేసి వ్రాయుఁడు.

1 చెప్పితివి+అని
2 నీవుఇచ్చితివి+ఏమి?
3 దాసరి+అయ్య
4 కోమటి+ఇల్లు
5 వచ్చితిమి+ఇపుడే
6 వారేగిరి+ఇక్కడనుండియే
7 మామిడి+ఆకు
8 అరటి+ఆకు
9 ఆనతి+ఇచ్చు
10 చేయుని+అట్టి
11 ఇది+ఏమి?
12 ఏవి+ఇచ్చినను
13 ఏమి+అంటివి
14 మంచి+ఉపాయము
15 వాని+అనుమానము
16 భూమి+అంతయు
17 పెట్టి+ఉన్నంత
18 పొంచి+ఉండెను
19 ఇంటినుండి+ఒక
20 కత్తి+ఈవలకు
21 జూదరి+ఎవడు
22 మఱి+ఏమాయె
23 అది+ఎంత వెల?
24 వానికి(న్)+ఇదెంత
25 ఇందలి+అభిప్రాయమేమి
26 ఇంటి+ఆమె
27 అగ్ని+ఎక్కడ
28 పైకి(న్)+ఎక్కె
29 వచ్చి+అచ్చట
30 చదివి+ఐనను
31 అని+ఆమెపలికె
32 చేయి+ఇచ్చుట
33 చేతి+అన్నము
34 మిత్రులుకాని+ఇతరులు

(b) ఈక్రిందివానిలో తప్పులు సవరింపుఁడు

1 వచ్చిచ్చెను
2 కూరవండిచ్చెను
3 చలికియోర్చుటకు
4 తెలివెంతయున్నను

5 వచ్చి నచ్చుటకూర్చుండె 12 ఆదేవిట్లనెను
6 పొంచివుండెను 13 పెట్టివున్నంత
7 చాలమందినమాయికులు 14 పోయివకరిని
8 మొదలగునవి చెన్నియో 15 చదివైనను గెలువవలె
9 నియమించినోక 16 అతనికి వప్పగించి
10 ఇచ్చినదృశ్యుఁడయ్యె 17 అని నీమెపలికె
11 వస్త్రములువిప్పినోడ్డున 18 పిల్లయందలి ననురక్తి

4. (a) ఉకారసంధి. క్రిందివానిలో సంధిసంబంధమైన మార్పులు చేయుఁడు.

1 పూర్వులు + ఒసఁగిన 8 అందు + ఉన్న
2 కొందఱు + అటులు 9 తాను + ఉన్న
3 దేహము + అనారోగ్యము 10 వారు + ఎక్కడ
4 నీవు + ఇంక 11 వెళ్ళుటకు + ఎన్ని
5 నీకొఱకు + ఇచ్చిన 12 ఆమెకు + ఉన్న
6 ఎట్లు + ఉండవలెను 13 చూచుచు + ఏగెను.
7 నరేంద్రుఁడు + ఇట్లనె 14 పెద్దలను + అనుసరింపవలె

(b) క్రిందివానిలోని తప్పులు సరిచేయుఁడు.

1 మీాయూరుయేది 5 ప్రాముఖ్యముయెఱిఁగి
2 ఏనుఁగుయెంతవెల 6 నీకుయెంత
3 ఎవరుయేమిచ్చినను 7 పాపముయిాతఁడు
4 ఎట్లువుండవలెనో 8 ఇట్లునాతఁడు

(c) అచ్చుపై హల్లు చేరినపుడు సంధి చేయఁగూడదని తెలిసి తప్పులు దిద్దుఁడు.

1 నరేంద్రుఁడొచ్చి 2 వయసొచ్చినది

3 ప్రాణములోదులుట　　6 వేటయందువరాజు
4 ఆలయమునకెళ్ళి　　7 శిష్యులనిడిచి
5 దగ్గఱకొచ్చి　　8 నూలొడుకుట

5. ఔపవిభక్తికరూపములు. ఈ క్రిందితప్పులు సవరింపుఁడు.

1 నూయిని త్రివ్వించెను　　4 చేయి నందించెను
2 ఊరును చేరెను　　5 కాలును వంచెను
3 గోయిని త్రివ్వెను　　6 నేయిని కాచెను

6. తెలుఁగు పదములమీఁద తద్ధితాది ప్రత్యయములు—తప్పులు సవరింపుఁడు.

ఉపసర్గలు—

1 రాణిత్వము　　7 అనేకమంది
2 మేలుకరము　　8 పరమతెలివి
3 ఎత్తుతరము　　9 దురలవాటు
4 మాటమంతుఁడు　　10 అనేకచోట్ల
5 తెలివిమంతుఁడు　　11 మేలుతరము
6 ప్రతివారు　　12 బహుమంది

7. (a) ఈ క్రింది తావులలో నవసరమైన మార్పులతో సంధులు చేయుఁడు.

1 దేవుఁడు+ఇచ్చినశక్తి　　6 ధేనువు+అఱచెను
2 ఇంటనున్న+ఒకవస్తువు　　7 అకట+ఎంతమోసము
3 దానినిగూర్చి+ఎందుకు　　8 ఏల+అన
4 దేశము+అంతయు　　9 ఊరక+ఉండనేల
5 రాజిడిన+ఆజ్ఞ　　10 మిన్నక+ఉండిన

11 వచ్చి + ఊరకనిలిచెను 19 ఏమొకో + అని
12 కష్టపడక + ఆశింపరాదు 20 కాని + ఇంకేమిచేయును
13 మేలుకలుగుఁగాక + అని 21 కాబట్టి + ఎచ్చట
14 పలువురు + ఆడినమాట 22 మిక్కిలి + ఆనందము
15 ఇంచుక + ఐనను 23 వేవేగ + అరుగము
16 కొంచెము + ఓపిక 24 కొన్ని + పండ్లు
17 మేము + ఏమన్నను 25 వానికై + ఇన్నిపాట్లు
18 అప్పుడు + ఏమియూటంకము 26 శ్రీమనుబట్టి + ఆశ

(b) ఈ క్రింది తప్పులు సవరింపుము.

1 అందుఁగల నొక యంశము
2 ఏలననఁగా
3 చేయుటకై నరిగెను
4 దారిద్ర్యమును బట్టిన న్యాయము
5 ఇంచుకనాసక్తి
6 మిక్కిలి నావేశము
7 మిన్నకనుండుము
8 తానువున్నచోట
9 కలుగుఁగాక ననియాశీర్వదించెను
10 ఇచ్చి నదృశ్యుఁడయ్యె
11 రాజుయొక్కనాజ్ఞ

8. (a) ఈ క్రిందివానిలో సంధులు కలుపుఁడు

1 మిత్రినిన్ + అడిగితిని
2 అశ్వమున్ + ఆరోహించెను
3 స్నేహితులన్ + అందఱను

4 అన్యాయముచేతన్ + అరిష్టము
5 దారిద్ర్యముచేతన్ + అక్రమబుద్ధులు
6 శ్రమతోన్ + ఆర్జన
7 నాకొఱకున్ + ఇచ్చెను
8 న్యాయమువలనన్ + ఆనందము
9 పాపముకంటెన్ + అన్యాయము
10 ఇంటికిన్ + ఏగెను
11 రాజునకున్ + ఒప్పగించెను
12 చేతిలోన్ + ఉన్నవిత్తము
13 మిత్రులందున్ + ఎవఁడు
14 మిగులన్ + ఆసక్తి
15 మఱియున్ + ఇట్లంటిని
16 బాగుగాన్ + ఉన్నది
17 గోటితోన్ + అగుపని
18 నావలెన్ + ఉన్న
19 చూడన్ + అరిగెను
20 ఇంతదనుకన్ + ఏమైతివి
21 చాలన్ + అక్రమము
22 కావునన్ + ఈర్ష్యతగదు
23 పరిశ్రమయున్ + ఆనందమును
24 తరువాతన్ + ఏమాయె
25 ఇంటిపైన్ + ఉన్న

(b) క్రింది తప్పులు సవరింపుఁడు

1 వానితోయంటిని
2 ముందుగాయూరక
3 కదలకుండయుంచెను
4 ఈశ్వరునియెక్కువగా
5 మీఁదయున్న
6 ప్రదర్శనములోయతఁడు
7 వేరుగయుండెడిది
8 విద్యలోయెక్కువ
9 మనకుయుపయోగము
10 అందముగకూడయుండదు
11 కడపటయాతనికి
12 అచ్చటయుండిరి
13 ఇంతవఱకుయుండెను
14 కదలకుండావున్నది
15 ఉండలేకనేవెడలె
16 నాకంటె యాతఁడుపెద్ద

17 అనినయిష్టము లేదు
18 ఇంక యెక్కువ
19 లేకుండయుండవలె
20 రాజుయిడుములపాలాయె
21 మొదట యాతఁడు
22 పాపమువలన యనేక
23 అయినను యీమె
24 చాలాయానందము
25 తానువున్న
26 దానికియిచ్చెను

(c) ఈ క్రిందివానిలోఁ గళలను ద్రుత ప్రకృతికములను వివేచించుకొని తగిన యక్షరములతో సంధి కార్యములు చేయుఁడు.

1 నాకై + ఎంతశ్రమ
2 పోనివలె + ఇది
3 మిక్కిలి + ఆశతో
4 కాని + ఇదెంతపని
5 కాబట్టి + ఊరకో
6 కావున + అడుగుము
7 ఎంతయు + ఆనందము
8 ఇంతదాక + ఎక్కడ
9 కొంచెము + ఆసక్తి
10 నల్లని + ఆవరణము
11 కడు + ఆసక్తితో
12 నాతోఁగూడ + ఏతెంచె
13 పిదప + ఇట్టియాపద
14 అకట + ఏమి సేతు
15 కూడ + ఉన్నాఁడు
16 సీతయు + ఆమెతల్లియు
17 ఇంచుక + ఓర్చుకొనుము
18 ఎప్పుడు + ఏది చెప్పినను
19 కష్టముమీఁద + ఆనందము
20 క్షేమముగ + ఉన్నాము
21 ఇంతకుఁదప్ప + ఏమియు
22 తినిన + ఏమగును
23 ఎవరి + ఆనందము
24 ఇప్పుడు + ఏమగును
25 భార్యపై + అనురాగము
26 తిన్నయెడల + ఏమగును
27 ముందుగా + అరిగెను
28 కొన్ని + అవసరములు
29 ఏ + ఎండకాగొడుగు
30 ఎంతయు + ఆనందము
31 చూడ + ఉన్నాను
32 చెప్పి + ఏగెను

(d) ఈ క్రిందవిడువఁబడిన స్థలములలోఁదగిన యక్షరము లుంపుఁడు

1 కావున — బద్ధమాడరాదు
2 వానితో — మంటివి ?
3 అసత్యముకంటె — త్మహత్యమేలు
4 లోభిత్వముచే — నర్థముకలుగును (=కీడు)
5 సిరిరా — డు పెట్టువాఁడుండునా ?
6 పిమ్మట — ల్లరు నూరుకొనిరి
7 ధనమునకై — న్ని తిప్పలుపడుట
8 వానిపై — తదురాగ్రహమేల ?
9 వ్యయము ఆయమునుబట్టి — నరింపవలెను
10 తొలియత్నముకాన — దలిలోపములు
11 చెప్పలేక — రు కొంటిని
12 కష్టింపక — శపడరాదు
13 సుఖముగా — టిరా !
14 ఇంచుకంత — విశ్వాసములేనివాఁడు (సముచ్చయము)
15 పరిశ్రమవలన — రోగ్యము బాగుపడును
16 ఇంటిలో — న్నదొంగనెట్లుపట్టుట ?
17 ఎన్నిచేసిన — మిలాభము ?
18 చూచుచు — రకుందువా ?
19 నాపై మిక్కిలి — నురాగము
20 దేశముయొక్క — దాయము
21 విజయముతోఁగూడ — శ్వర్యముప్రాప్తించును

22 ఊరకచచ్చుచేల — నిమరల జీవించితిని

23 వచ్చుదాక — పికవహింపుము

24 ఇదియెంతయు-న్యాయము(=న్యాయమునకువ్యతిరేకము)

(e) క్రింది ద్రుతములమీఁద పరుషసరళములు చేరి నప్పుడు కావింపఁదగుమార్పులు చేయుఁడు. ఉ: పిదపన్ + కొండలు=పిదపఁగొండలు. దీర్ఘముమీఁద నిండుసున్న లేదు.

1 కానన్ + చేయఁదగు | 6 రాతిపైన్ + కూరుచుండి
2 రాన్ + తలఁచెను | 7 భక్తితోన్ + పూజించెను
3 చూచుచున్ + చదివెను | 8 చాలన్ + ధైర్యము
4 చేయన్ + చూచెను | 9 మీఁదన్ + జరిగినదేమి
5 చెప్పినన్ + చేయుదున్ + కదా | 10 అమితత్వమువలనన్ + జాడ్యము

(f) ద్రుతముమీఁది పరుషములు సరళములుగా మాఱినప్పుడే వానిముందున్న ద్రుతమునకు బదులుగా నరసున్న వచ్చును. స్వతస్సిద్ధమైన సరళములకు ముందుఁ గొంద అరసున్న యుంచుచున్నారు. ఇదితప్పు. ద్రుతము, ను, ని, రూపముగా నిలిచి పోయినప్పుడుకూడ నధికముగా నరసున్న యుంచరాదు.

ఈ క్రింది తప్పులు సవరింపుఁడు.

1 నాకుఁజరుగకున్నది | 4 వింటినిఁధరించి
2 చేతితోఁగంటలుమ్రోగించి | 5 పలువురతోఁజగడము
3 కడుఁజాగ్రత్త | 6 అన్నముఁభక్షించెను

(g) ప్రథమావిభక్తి మీఁదను, అవ్యయముల మీఁదను పరుషములు, గ, స, డ, ద, వ, లుగ మాఱును. ఈమార్పు భారతకాలమున నిత్యముగాను, తరువాత బహుళముగాను జరుగుచు వచ్చెను. నేఁటికాలమున సదివెను, వలికెను, అని వ్రాయు వారంతగ లేరు. అందుచే నిట్టి మార్పును జేయకుండుటే మంచిది. దు్రితప్రికృతికము మీఁద రావలసిన గ, జ, డ, ద, బ, ల మార్పును గొందఱు ప్రథమావిభక్తి మీఁదఁ బొరపాటునఁ జేయుచున్నారు. కావున, అప్పుడు జేసెను, చేయిబగిలెను, వ్యాసుఁడిట్లు జెప్పెను, ఋషులేదిబలికినను అని వ్రాయరాదు.

9. ఉకారాంత పదముల మీఁదఁ జేరు "కు" ప్రత్యయమునకు ముందును, షష్ఠీతత్పురుష సమాసమున ఉకార ఋకారముల కచ్చుపరమైనపుడును, 'న' చేరును. క్రింది వానిలో న్ను గాగమపు మార్పు చేయుఁడు ఇతర సమాసపు మార్పులుగూడఁ జేయుచు తప్పులు దిద్దుఁడు.

| | |
|---|---|
| 1 వృక్షముకు | 7 బంధువింటికి |
| 2 గృహముకు | 8 పితృఆనతి |
| 3 కష్టముకుఁదగిన | 9 సరసముమాట |
| 4 కుటుంబమెదుట | 10 వేల్పుయావు |
| 5 దేవుఁడుఆజ్ఞ (సమాసము) | 11 మదవేనుఁగు |
| 6 రాజుయాజ్ఞ | 12 బంగారపుంగరము |

10.(a) ఈక్రిందిపదములతో సరియైనసమాసములు చేయుఁడు.

1 వృద్ధ — వాక్కులు, మాటలు
2 నీచ — భావము, తలంపులు

3 వృక్ష — ఛాయ, నీడ
4 గురు — ఆజ్ఞ, ఆనతి
5 గో — క్షీరము, పాలు
6 విష్ణు — గృహము, ఇల్లు
7 సీతా — సౌందర్యము, అందము
8 ఆపత్ — ప్రార్థనలు, మొక్కులు

(b) ఈ క్రిందివానిలో తప్పులు దిద్ది సరియైన సమాసములును రూపములును వ్రాయుడు. సమాసము కుదరనిచో విడి పదములుగా వ్రాయుడు.

| | |
|---|---|
| 1 బీదస్థితి | 12 భార్యాబిడ్డలు |
| 2 బీదావస్థ | 13 దక్షిణవైపు |
| 3 ఆహారలేమి | 14 చెడుద్దేశము |
| 4 అనేకచోట్ల | 15 ప్రియచెల్లెలు |
| 5 యుద్ధపనులు | 16 ధనవిలువ |
| 6 ప్రపంచనడక | 17 మేల్తరము |
| 7 విమపురుగు | 18 ఈశాన్యవానలు |
| 8 దేశమెలుఁగు | 19 ముఖ్యపంట |
| 9 ప్రఖ్యాతిగారడివాఁడు | 20 స్వాభావిక మెరువులు |
| 10 సన్యాసి గుంపు | 21 దేశరైతు |
| 11 పురాతన పనిముట్లులు | 22 దానపట్టా |

(c) ఈ క్రింది సమాసములకు సరియైన తెలుఁగు సమాసములు వ్రాయుడు.

| | |
|---|---|
| 1 రాజాజ్ఞ | 3 పల్లవపాణి |
| 2 నదీజలము | 4 ముఖచంద్రుఁడు |

5 పుష్పమధువు
6 పితాపుత్రులు
7 తటాకోదకము
8 నీలోత్పలము
9 రక్తబిందువు
10 ఆకాశమార్గము
11 మధురవచస్సులు
12 శీతోష్ణములు
13 సువర్ణకలశము
14 బ్రాహ్మణబృందము
15 దేవసభ
16 త్రినేత్రుఁడు
17 సహస్రభానుఁడు
18 అబ్ధిపుత్రి
19 పుష్పవనము
20 ఉత్తమమిత్రుఁడు

11. ఈ క్రింది క్రియాదోషములను సవరింపుఁడు

1 కూర్చుని
2 తెలుసుకున్నాను
3 ఇవ్వబోయెను
4 చెప్పమనికోరెను
5 ప్రార్థించమనఁగా
6 నిలబడమనిచెప్పె
7 తీసుకొని
8 ధరించమనెను
9 పెట్టుకుని
10 పలుకమనెను
11 క్షమింపమనివేడె
12 నాకు తెలుసు
13 రాసినాను
14 ఉపయోగించమనికోరె

12. ఈ క్రింది తప్పులు సవరింపుఁడు.

1 వ్రాయించక
2 భక్షించక
3 సేవించఁబోయెను
4 పూజించఁగలను
5 త్యజించఁబడి
6 ఆశీర్వదించుము
7 పనిచేపించెను
8 కలముతో రాపించెను
9 వ్రాయింపించెను

13. ఈ క్రింది దోషములు సవరింపుఁడు

1 సీతను రాముడుయు

2 మరిన్ని

3 వ్రాయుటను, చదువుటను నభ్యసింపవలెను.

4 ఆరోగ్యము, ఐశ్వర్యము, ఉత్సాహము, బలము ఉండవలెను.

5 రాజు ప్రజలయొక్కయు తన క్షేమము చూడవలెను.

14. తప్పులు దిద్దుఁడు.

1 ఆంగ్ల ప్రభుత్వము చిరకాలము పాలించిరి.

2 ప్రభుత్వశాసనముచే మద్యపానమును నిషేధింపఁబడెను.

3 ప్రస్తుతము మన దేశస్థులే మనలను పాలించుచుచుండిరి.

4 తాను యుద్ధమున కరుదెంచెను.

5 గాయపడినయన్న యొద్దనేయుండి తనకు కావలసిన సహాయము చేయుచుండెను.

15. (a) క్రింది సంస్కృతసంధులను గలుపుఁడు.

| | |
|---|---|
| 1 స్తోత్ర + అర్హము | 9 రాజ + ఋషి |
| 2 చంద్ర + ఆనన | 10 పరమ + ఏకాంతము |
| 3 ప్రజా + అభ్యుదయము | 11 శర + ఓఘము |
| 4 కవి + ఈశ్వరుఁడు | 12 సంఘ + ఔన్నత్యము |
| 5 గిరి + ఇంద్రుఁడు | 13 అతి + ఆనందము |
| 6 ప్రభు + ఉక్తి | 14 ప్రభు + ఆదేశము |
| 7 గురు + ఉదయము | 15 కీర్తి + ఉత్కృష్టత |
| 8 పితృ + ఋణము | 16 స్వశక్తి + అతీతము |

| | |
|---|---|
| 17 రామ + ఉదంతము | 19 విష్ణు + ఆలయము |
| 18 పరమ + ఈశ్వరుడు | 20 ఏతత్ + శుభము |

15. (b) క్రింది వానిలో దప్పులు దిద్దుడు.

| | |
|---|---|
| 1 గురోపదేశము | 5 గురువాదేశము |
| 2 పూర్వయభ్యాసము | 6 ప్రతియాగమము |
| 3 చంద్రియుదయము | 7 పితృయాజ్ఞ |
| 4 సంఘయాదరణము | 8 మధ్యహానము |

---

# వ్యాసములకు అంశసంగ్రహము IV

I. వార్తాపత్రికలు :

1. మనుష్య స్వభావము - సంఘ జీవిత్వము - వార్తా వ్యాపనావశ్యకత.

2. వార్తావ్యాపనలో పూర్వకాలీన స్థితులు - యంత్రయుగము - యావత్ప్రపంచ సంబంధము - వార్తా పత్రికారంభము.

3. పడమటి దేశములలోఁ బత్రికలు - వివిధములగు పత్రికలు - పలుభాషలలో సంచికలు, పత్రికలు మొ॥

4. పత్రికలు వార్తలు సంపాదించు విధము - వ్యాస లేఖకులు. పాఠశాలలలో వ్రాతపత్రికలు.

5. పత్రికలవలని బహుప్రయోజనములు - ప్రపంచ జ్ఞానము - వర్తకము - సాంఘిక రాజకీయములు - విజ్ఞానానందము - పత్రికలవలన సత్ప్రచారము - దుష్ప్రచారము.

6. పత్రికలపట్ల ప్రజల యాసక్తి - ప్రభుత్వపు పర్యవేక్షణ. శాసన సభల ఎన్నికలలో-వీని ప్రయోజనము.

7. విద్యార్థుల పత్రికాపఠనావశ్యకత - వివేచనము - భాషాసేవ-విజ్ఞాన వ్యాప్తి-నాగరకతావృద్ధి. పత్రికలేనినాఁడు.

II. భారతదేశపు వ్యవసాయాభివృద్ధి :

1. విశాలప్రపంచమున వివిధదేశములు - వేర్వేఱు శీతోష్ణాది పరిస్థితులనుబట్టి ప్రజలజీవనోపాధికి వేర్వేఱు వృత్తులు.

2. భారతదేశపు భూసారములో భేదములు, నదులు-చెఱువులు - శీతోష్ణభేదములు - మైదానములు - పీఠభూములు - సముద్రతీరములు.

3. అనాదికాలమునుండియు వ్యవసాయము ముఖ్యవృత్తి వేదకాలపునాగరికత—పర్జన్యుని - నాగలిని పూజించుట - పశుసంపద. గోమాత పూజ - వ్యవసాయ మూలాధారములు.

4. నూటిలో నెనుబదిరెండుమందికి వ్యవసాయవృత్తి-వర్షము కొఱకు యజ్ఞాదులు - సమష్టి కుటుంబములు.

5. యంత్రయుగము-పాశ్చాత్య దేశములతో పోటీ ఆధునిక వ్యావసాయిక పద్ధతుల యావశ్యకత - వ్యవసాయమునకును వర్తకమునకును గల సంబంధము. జపానువరిసాగు మొ॥

6. జనసంఖ్య పెరుగుదల - యుద్ధానంతర పరిస్థితులు-తిండికొఱత-హెచ్చుపంటల ప్రచారము - ప్రభుత్వము సంకల్పించిన పంచవర్ష ప్రణాళిక మొదలైనవి-సామూహికపథకములు.

7. వ్యావసాయిక పరిశోధనలు- ప్రభుత్వ వ్యవసాయశాఖకర్తవ్యము. ప్రజోద్బోధమునకు విద్యార్థుల ధర్మము.

